Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యూం I.] మద్రాసు : 1941 వ సం॥ ఏప్రిల్ నెల 26 వ తేది శనివారం [నె 6 ద.

## ఈ వారంలో యుద్ధ వార్తలు.

### విమాన దాడులు.

బ్రిటిషు విమానాలు ఈ వారం జర్మనీపైన ఇదివరకు కంటె చాల భయంకరమైన దాడులు సాగించాయి. అనేక క్రొత్త రకపు విమానాలు, పెద్ద పెద్ద క్రొత్త బాంబులతో ఈ దాడులలో పాల్గొన్నాయి. 17 వ తేది రాత్రి, బ్రిటిషు విమానాలు, వందల కొలదిగా జర్మనీ రాజధానియగు బర్లిను నగరం పైకి వెళ్లి వేలకొలది బాంబులు వర్షించాయి. ఇంత తీవ్రమైన దాడి బ్రిటిషు విమానా లెప్పుడు జరిపియుండలేదు. విమానాలు తమ పని ముగించి తిరుగు ముఖంపట్టేసరికి నగర మధ్యభాగమంతా పెద్ద అగ్నిజ్వాలమయంగా కనిపించింది. ఆ రోజు పగటివేళ, ఫ్రాన్సుతీరపు రేవులమీద—అందు ముఖ్యంగా షెర్బర్గు రేవుమీద—బ్రిటిషు విమానాలు పెద్ద దాడి సాగించాయి. ఇటువంటి దాడి వస్తుందని శత్రులనుకోలేదు. అందుచే వారేమాత్రం యెదుర్కొలేకపోయారు. బ్రిటిషు బాంబులకు రేవులోవున్న చాల వర్తక నౌకలు మునిగిపోయాయి. 18 వ తేదిన బ్రిటిషు విమానాలు ఉత్తరాన నార్వేనుండి, దక్షిణాన ఫ్రాన్సువరకునుగల శత్రు ఆక్రమిత ప్రాంతపు రేవులన్నిటినీ, బాంబులవర్షంతో ముంచి లేవనెత్తాయి. ఈ దాడులలో, హెలిగోలాండు సమీపంలో, జర్మనీకి సరకుల తీసుకొని వెళ్లుచున్న నౌకలను, వానికి రక్షణగానున్న యుద్ధ నౌకలనుకూడ, బ్రిటిషు బాంబరు విమానాలు పూర్తిగ ముంచి వేశాయి. నార్వే తీరంలో 7, 00 టన్నుల పరిమాణంగల శత్రుల సప్లయి నౌక ఒకటి 3,000 టన్నుల పరిమాణం గల నౌక మరియొకటి బ్రిటిషు విమానాలు బాంబులువేసి ముంచివేశాయి. శనివారం రోజు పగలు బ్రిటిషు విమానాలు, శత్రు రేవులపైన నౌకలపైన ఈ దాడుల నింకా సాగించాయి. ఈ దాడులలో 5,000 టన్నుల శత్రు నౌక యొకటి, 7,000 టన్నుల నౌక మరియొకటి ముంచివేయబడినవి. ఇంకా మరికొన్ని చిన్న చిన్న నౌకలుగూడా ముంచివేయబడ్డాయి. ఆదివారం నాడు మంచు దట్టంగా పడుచుండుటవలన వాతావరణం అనుకూలంగా లేకపోయినా జర్మనీపైన, జర్మను ఆక్రమిత ప్రాంతాలమీద పెద్ద దాడులు జరిపాయి. డసల్‌డార్ఫ్, కొలోను, ఆషెన్ మొదలగు జర్మనీలోని పారిశ్రామిక పట్నాలపై వేలకొలది బాంబులు వర్షించాయి. రాటర్‌డాంలోనున్న నూనె గిడ్డంగులమీద డంకర్కు, ఓస్టెంటు బ్రెస్టు మొదలగు రేవులమీద, విమానాశ్రయములమీద, చాల బాంబులువేసి శిథిలపరచాయి. నిండుగా సరకుల తీసుకొనిపోవుచున్న 3,000 టన్నుల శత్రు నౌక యొకటి ముంచి వేయబడింది.

21 వ తేదిన బ్రిటిషు విమానాలు ఫ్రాన్సుతీరంలోని లీహావ్రే రేవును నౌకా నిర్మాణ శాలను ధ్వంసం చేశాయి. జర్మను యుద్ధ నౌకలు విశ్రమించియున్న బ్రెస్టురేవుపైన 22 వ తేదిన తీవ్రమైన దాడి సాగించాయి. బుధవారం నాటి విమానదాడిలో నార్వే ప్రాంతాన 2,000 టన్నుల శత్రుల సప్లై నౌక యొకటి ముంచి వేయబడింది. ఆనాడు పగలు, చాల బ్రిటిషు విమానాలు జర్మనీలోని పడమటి ప్రాంతాల పట్నాలపై విస్తారమైన దాడులు సాగించి ఇబ్బర్ బురెన్, ఓస్నాబ్రుక్ మొదలగు పట్నాలలోని ఫ్యాక్టరీలను, "ఎలెక్ట్రిసిటీ" యంత్రాలయములను శిథిలం చేశాయి. ఈ దాడులలో ఒక్క బ్రిటిషు విమానం మాత్రం నష్టమైనది. విమానాలు తిరిగి వస్తూ త్రోవలో డచ్చి తీరంలో 3 శత్రు నౌకలను ముంచి వేశాయి. బ్రిటిషు బాంబులచే శిథిలమై పోయిన, కీలురేవుకు మరమ్మతుల చేసుకొనుట జర్మనుకు దుర్ఘటంగా వుందని తటస్థదేశీయులు తెలుపుచున్నారు.

17 వ తేది రాత్రి లండను నగరంమీద శత్రువిమానాలు యెక్కువ దాడిని సాగించలేదుగాని, ఇంగ్లండులో తూర్పు-దక్షిణ-ఉత్తర ప్రాంతాలలోమాత్రం చాలచోట్ల బాంబులు పడ్డాయి. నష్టంమాత్రం యెక్కువ కలుగలేదు వీని అన్నిటిలోకి, దక్షిణ తీరంలోగల పోర్ట్సుమత్ అను రేవుమీద సాయంత్రం ప్రారంభించి, చాల గంటలసేపు వేలకొలది బాంబులు వర్షించాయి. కాని నష్టంమాత్రం యెక్కువ కల్గించలేకపోయాయి. ఈదాడిలో మూడు శత్రు విమానాలను బ్రిటిషువారు పడగొట్టారు. శుక్రవారం పగలు బ్రిటనుపై యెక్కడా దాడులులేవు. రాత్రి అక్కడక్కడ స్వల్పంగా బాంబులు పడ్డాయి. 19 వ తేది శనివారం రాత్రి శత్రు విమానాలు లండనుమీద తెల్లవారేవరకు చాల తీవ్రమైన దాడినే సాగించాయి. ఒకమాదిరిగ యెక్కువ నష్టమే కలిగింది. బర్లినుపై బ్రిటిషు విమానాల దాడికి ప్రతీకారంగా లండనుపై యీ దాడి జరిపితిమని జర్మనులు ప్రకటించారు. ఇతర ప్రాంతాలలోగూడ శత్రు బాంబులవలన కొంతవరకు నష్టం కలిగింది. క్రిందనుండి విమానధ్వంసక ఫిరంగులు అగ్ని గోళాలను ఆకాశంమీదకు విరజిమ్ముటంవలన, శత్రువులు చాలా యెత్తుగనే యుండవలసివచ్చింది. ఆదివారం పగలు బ్రిటిషు తీరపు పట్నాలపైన అక్కడక్కడ శత్రు విమానాలు బాంబుల వేశాయి. రాత్రి లండనుమీదికిగూడ కొంతసేపు వచ్చాయిగాని, ఎక్కువ బాంబులు వేయలేదు. 21 వ తేదిన ఇంగ్లాండులో నైరుతి భాగాన కొన్ని బాంబులు పడ్డాయి. ఆ రాత్రి ప్లిమత్ రేవు పట్టణంమీద వేలకొలది బాంబులువేసి తీవ్రంగా దాడి జరిపాయి. 22, 23 వ తేది రాత్రులలోగూడ, మరల ప్లిమత్ పట్నం అదేవిధంగా తీవ్రతరమైన దాడులకు గురిచేయబడింది. 24 వ తేది పగలు వేర్వేరు పట్నాలలో అచ్చటచ్చట స్వల్పంగా బాంబులు పడ్డాయి. ప్లిమత్‌లో నష్టం విస్తారంగానే కల్గిందని చెప్పాలి. జార్జి చక్రవర్తి స్వయంగా బాంబులచే నష్టపడిన ప్రదేశాలను దర్శించి ప్రజలను పరామర్శింపగా ప్రజలు అత్యద్భుతమైన ధైర్యోత్సాహాలను ప్రకటించారు.

ఈ దాడులలో, లండనునందు పార్లమెంటు భవనములపై గూడ కొన్ని బాంబులు పడి కొంతభాగం శిథిలమైనది. సెయింటుపాలు చర్చికి మరికొన్ని యితర చర్చీలకు వైద్యశాలలకు వస్తుప్రదర్శనశాలలకుగూడ నష్టంకలిగినది.

బ్రిటనుపై జరిగిన విమాన దాడులలో యింతవరకు 500 జర్మను విమానాలు క్రిందనున్న విమానధ్వంసక ఫిరంగులవలన పడగొట్టబడినవి. మాల్టా యీజిప్టు మొదలగు ప్రాంతాలలో ఫిరంగులవలన మరి 500 విమానాలు పడగొట్టబడెను. బ్రిటనులో విమానధ్వంసక ఫిరంగులకు గురిని నిర్ణయించే సున్నితమైన యంత్రాలవద్ద పనిచేసి గురిచెప్పడానికిపుడు స్త్రీలను నియమిస్తున్నారు.

ఇన్ని విమానదాడులు జరుగుచున్నా లండనులో ప్రజలు యేమాత్రం దిగులుపడకుండ యథాపూర్వంగానే తమ పనులు చూచుకుంటున్నారు. 20 వ తేదిన లండనులో యిర్వురు వస్తాదులకు ముష్టియుద్ధ ప్రదర్శనం జరిగింది. శత్రు విమాన దాడుల భయమేమీలేకుండ వేలకొలది ప్రేక్షకులా ప్రదర్శనానికివచ్చి అత్యుత్యాహంతో చూచారు. చోటులేక చాల మంది తిరిగి వెళ్లవలసివచ్చింది.

## బాల్కను యుద్ధ రంగం.

బాల్కను రంగాలలో యుద్ధ పరిస్థితులు ఈవారం విషమించాయి. జర్మను సైన్యాలను మిత్రమండలి సైన్యాలు పూచకోతకోసి అపారమైన నష్టం కల్గించాయి. కాని శత్రుసైన్యాలు ఇసుకపాతరలాగ వచ్చి పడటంవలన మిత్రమండలి సైన్యాలు వెనుకకు తగ్గవలసివచ్చినది.

దీనికి చాలవరకు, యుగోస్లావు సైన్యాలు అనుకొనినదానికంటె ముందుగ లొంగిపోవటం కారణం. 17 వ తేది రాత్రికి యుగోస్లావియా సైన్యాలు యుద్ధం మాని ఆయుధాలను క్రిందపడవేశాయి. కొంత సైన్యం దక్షిణానికివచ్చి గ్రీసు సైన్యాలతో కలసిపోరాటం సాగించాయి. మరికొంత సైన్యం యుగోస్లావియా పర్వతాలలోనుండి అనుకూలం చూచుకొని శత్రులపైబడుతూ, చాలానష్టం కలిగిస్తున్నది. యుగోస్లావియా ప్రధాని సిమొవిచ్‌గారు పీటరు రాజు మరికొందరు మంత్రులు గ్రీసు రాజధానియగు యేథెన్సు వచ్చిచేరారు. అక్కడనుండి 2! వ తేదిన విమానంలో ఆసియా మైనరు నందుగల జెరోసిలం నగరమునకు వెళ్లుచుండగా, శత్రువిమాన మొకటి వెన్నంటి తుపాకులు ప్రేల్చింది. విమానంలోవున్న మంత్రులలో నొకరు మరణించారు. పీటరు రాజు మిగిలిన మంత్రులు సురక్షితంగా జెరోసలం చేరారు. పీటరు రాజు జెరోసలంకు బయలుదేరుతూ తాను యుద్ధాన్ని విరమించడంలేదనీ, దానినింకా విజయవంతంగా సాగించడానికే వెళ్లుచుంటిననీ, సంపూర్ణ విజయంతో, స్వతంత్రమగు యుగోస్లావియాకు తిరిగి వస్తాననీ ధైర్యంతో వుండవలసినదనీ. తన ప్రజలకు సందేశం పంపించాడు.

యుగోస్లావియాలో యుద్ధం ఆవిధంగా ముగియటంతోనే అచ్చటి శత్రు సైన్యాలుగూడా గ్రీసులో గ్రీకు-బ్రిటిషు సైన్యాలు ప్రతిఘటించుచున్న ఫ్లోరినా ప్రాంతపు యుద్ధరంగంలోనికి వచ్చి పడ్డాయి. గ్రీకు-బ్రిటిషు సైన్యాలు అనుకూలమైన ప్రదేశాలలోనుండి శత్రులను పూచకోతకోసినాయి. 17 వ తేదినాటికి గ్రీకు రంగాలలో 60 వేలమంది జర్మను సైనికులు మరణించారని టర్కీ ప్రభుత్వపు రేడియో వార్తాలయం ప్రకటించింది. శత్రు వత్తిడివలన గ్రీకు బ్రిటిషు సైన్యాలు అడుగడుగును పోరాటం సాగిస్తూనే క్రమంగా వెనుకకు తగ్గడం ప్రారంభించాయి. 21 వ తేదికి తూర్పున ఒలింపస్ పర్వతప్రాంతమువద్ద భయంకరమైన సంగ్రామం జరిగి యుద్ధరంగమంతా వేలకొలది జర్మను సైనికుల కళేబరాలతో విరజిమ్మబడివుంది. జర్మను సైన్యాలు ఒక ప్రవాహాన్ని దాటుటకు ప్రయత్నించినపుడు బ్రిటిషు-గ్రీకు సైన్యాలు ఆవలియొడ్డునుండి తుపాకి గుండ్లతో వేలకొలదిగ చంపేశాయి. ఆ ప్రవాహమంతా జర్మను సైనికుల రక్తంతో యెఱ్ఱబారిపోయింది. నదియంతా జర్మను సైనికుల కళేబరాలే. యెందరు హతులైనా లక్ష్యపెట్టక శత్రువులు లక్షలకొలదిగా పైబడుచున్నారు. అందుచే గ్రీసు రంగంలో మిత్రమండలి సైన్యాలు, దానితోబాటు అల్బేనియాలో గ్రీసు సైన్యాలు తమ స్థానాలను ఖాళీచేసి వెనుకకు పోవలసివచ్చింది. మిత్రమండలి సైన్యాలు యుద్ధరంగపు పొడుగును తగ్గించుకోడానికిగాను ఇంకా దక్షిణమునకు మరలుటకు ప్రారంభించారు. జర్మనులు మిత్రమండలి సైనిక పంక్తులను ఛేదించి చీల్చవలెనని అనేకమార్లు ప్రయత్నించారు కాని అన్నిసార్లు అపారనష్టంతో వెనుకకు కొట్టివేయబడ్డారు.

గ్రీసు యుద్ధ పరిస్థితులు ఇలా విషమమగుటవలన ప్రధాని కొరిస్‌గారు 18 వ తేదిన ఆత్మహత్య చేసుకున్నారు. అంతట గ్రీసు రాజగు జార్జిగారే ప్రభుత్వానికి నాయకత్వం వహించి, క్రొత్త మంత్రి వర్గాన్ని యేర్పరుచుకన్నారు. గ్రీసు తుదకు విజయం సాధించు వరకును యుద్ధమును సాగించుచునే యుండునని క్రొత్త మంత్రివర్గంవారు ప్రకటించారు.

శత్రువిమానాలు 21 వ తేదీన గ్రీసు పడమటివైపునగల కర్ఫూద్వీపపు రేవును గ్రీసు దక్షిణతీరపు రేవగు పిరయస్‌ను బాంబులువేసి శిథిలమొనర్చుటకు జర్మనులు ప్రయత్నించారు. 22 వ తేదీ రాత్రి గ్రీసులోని ఎపిరస్, పిండస్ అనే ప్రాంతాలలోని గ్రీకు సేనానాయకులు, గ్రీసు ప్రభుత్వంతో సంప్రదించకుండానే తమ సైన్యాలులొంగి పోవునని శత్రు సేనానాయకులకు తెలిపి, ఒక యుద్ధ విరామపు ఒడంబడికను కుదుర్చుకున్నారు. ఆ యొడంబడికలో ఇటలీ-జర్మను సేనానాయకులు గ్రీకుల అద్భుత శౌర్య పరాక్రమాలను ప్రశంసించి గ్రీకు సైన్యాలను తాము ఖైదీలుగా పరిగణించినా సైనికాధికారులుమాత్రం తమ ఆయుధాలను దుస్తులనన్నిటినీ వుంచుకోవచ్చునని తెలియజేశారు. ఈ సంఘటనలవలన తూర్పు వైపున పోరాడుచున్న బ్రిటిషు గ్రీకు సైన్యాలస్థితి కొంచెం అపాయకరంగాఉంది. అందుచే వారు ఇంకా కొంత వెనుకకు తగ్గి చరిత్రప్రసిద్ధమైన "థర్మాపలే కనుమ"కుచేరి అచట శత్రుల నిలువరించి పోరాటం సాగిస్తున్నారు. గ్రీసు రాజు జార్జి, తన మంత్రివర్గంతోగూడ రాజధానియగు వదలి 22 వ తేదీన క్రీటాద్వీపమునకు వెళ్లి అచ్చటనుండి పోరాటాన్ని సాగించెదమని శత్రువుకు లొంగుటయనునది వుండదని ప్రకటించాడు. గ్రీకు సేనలలో ఎక్కువభాగము, బ్రిటిషు, ఆస్ట్రేలియా, న్యూజీలెండు సేనలతోకలిసి క్రొత్త రక్షణ స్థానముల నాక్రమించి శత్రులతో పోరాడుచున్నాయి. బ్రిటీషు సైన్యములు థర్మాపలే మార్గములో జర్మనులను ఎదుర్కొంటున్నాయి. కాని పరిస్థితులు క్లిష్టంగానే ఉన్నాయి. టర్కీ కూడా యీ యుద్ధంలో చేరి ఉంటే బాగుండేది. కాని బ్రిటన్ మాత్రం గ్రీసుకు సహాయం చెయ్యకపోతే మిక్కిలి నిందపాలయ్యేది. ఆస్ట్రేలియా ప్రధాన మంత్రి చెప్పిందిదే.

గ్రీసులో యుద్ధం పైవిధంగా సాగుచుండగనే, యుగోస్లావియా, గ్రీసుదేశాల విభజనలగురించి అపుడే ఆక్సిసు రాజ్యాలలో తంత్రాలు ప్రారంభమైనాయి. గ్రీసులోని త్రేసు రాష్ట్రాన్ని, మాసిడోనియాలో తూర్పుభాగాన్ని, పశ్చిమ

భాగంలో వరదార్‌నది వరకు, యుగోస్లావియాలో నైరుతి భాగాన్ని బల్గేరియాకు, తాత్కాలికంగా జర్మనులు స్వాధీన పరచారు. యుగోస్లావియా ఉత్తరాన హంగరీ కొంత, రుమేనియా కొంత ఇదివరకే ఆక్రమించాయి.

### ఆఫ్రికా యుద్ధరంగం.

ఆఫ్రికా యుద్ధరంగాలలో, బ్రిటిషు సైన్యాలు ఇంకా విజయపరంపరలను సాధిస్తూనే వున్నాయి. ఎరిత్రియా రాష్ట్రమునుంచి కొంత సైన్యంతో తప్పించుకొనిపోయిన ఇటాలియనుల ఫ్రాస్కో సేనాని, అబిసీనియాలో డెస్సీ అనే కొండ దుర్గప్రాంతంలో నున్నాడని తెలిసి బ్రిటిషు సామ్రాజ్య సైన్యాలు వెంటనంటి ఆ దుర్గప్రాంతాన్ని చేరాయి. బ్రిటిషు విమానాలు శత్రు శిబిరాలను నిరంతరం బాంబుల అగ్నిగోళాలతో శిథిలం చేస్తున్నవి. అబిసీనియా రాజధాని ఖాళీచేసివెళ్లిన, ఇటాలియను రాజప్రతినిధియగు "డ్యూక్ ఆఫ్ అసోటా"గారు, అడిస్ అబాబా నగరానికి ఆగ్నేయ ప్రాంతంలో పర్వతప్రాంతాలలో కొంత సైన్యంతో నిలచి వున్నాడు. అతనిపైకి యెనిమిది వైపులనుండి బ్రిటిషు సామ్రాజ్య సైన్యాలు నడుస్తున్నాయి. 'డ్యూర్ అఫ్ అసోటా' గారు, అబిసీనియాలోని యిటాలియనుల రక్షణకు సౌకర్యాలు చేయించవలసినదని, బ్రిటిషు సేనాధిపతియగు కన్నింగుహాం గారికి రాయబారం పంపాడు. ఇటాలియను సైన్యాలు పూర్తిగా లొంగిపోతేనేగాని ఈ విషయం ఆలోచించడానికి వీలులేదని అతడు ప్రత్యుత్తర మిచ్చాడు. కాని అతడు అటుల లొంగుటకు అంగీకరింపలేదు. అందుచే, ఆ రెండు సైన్యాలను బ్రిటిషు సైన్యాలింకను తరుముకొని పోవుచునే యున్నవి. బ్రిటిషు సైన్యాలు 22 వ తేదీన డెస్సీదగ్గిర ఫ్రాస్కోగారి సేనాలను నిలువరించి యుద్ధానికి దింపాయి. 24 వ తేదీన ఉభయ పక్షాలకు తీవ్రమైన పోరాటంజరిగి బ్రిటిషు సైన్యాలు డెస్సీ దుర్గపు వెలుపలి ప్రాకారాలను ఆక్రమించాయి. ఇటాలియనులు అచటనుండి వెనుకకు పోవడానికి ప్రారంభించారు చాలవందలమంది ఇటాలియనులు ఖైదీలుగా చిక్కారు. వెనుకటి అబిసీనియా చక్రవర్తి హెయిల్ సెలాసీగారి పెద్ద కుమారుడు (యువరాజు) అబిసినియా సైన్యాలను లేవదీసి పోరాటం సాగిస్తున్నాడు. రెండవ కుమారుడగు హిరార్ ప్రభువు 22 వ తేదీన హరార్‌ను ప్రవేశించి, ఆ రాష్ట్రపు పరిపాలనాధికారం స్వీకరించాడు.

లిబియా (ఉత్తరాఫ్రికా) రంగంలో యెక్కువ మార్పులు లేవు. టొబ్రూక్ రేవు పట్టణమును బ్రిటిషు సేన లింకను రక్షించుకొనుచునే యున్నవి. అచటి సైనికులు, అపుడు అపుడు ఆకస్మికంగా కోటనుండి పైకివచ్చి శత్రులపైబడి చాల నష్టం కలిగించుచున్నారు. 2,000 వరకు శత్రు సైనికులను ఖైదీలుగాగూడ పట్టుకొనగల్గిరి. లిబియా ఈజిప్టుసరిహద్దు ప్రాంతమందలి సోలం, కోపుజా రేవు దుర్గాలను తిరిగి స్వాధీనంచేసుకొనుటకు బ్రిటిషు సైన్యాలు ఆప్రాంతంలో పోరాటం సాగిస్తున్నాయి. ఆ కోటలమీదను బెంఘాజీ, ట్రిపోలీ మొదలగు ఉత్తర ఆఫ్రికా తీరంలోని శత్రు రేవులను విమానాశ్రయాలను, బ్రిటిషు విమానాలు రోజూ బాంబుల అగ్నివర్షం కురిపించి వస్తున్నవి. 19 తేదీ రాత్రి బ్రిటిషు నౌకాదళం, అతిధైర్య సాహసాలతో, శత్రు సైనిక దుర్గమగు బర్డియా రేవులో ప్రవేశించి బ్రిటిషు సైనికుల నచట దింపింది. ఆ సైనికులు దుర్గంలోకివెళ్లి మందుగుండు గిడ్డంగులను వంతెనలను నిర్మూలంచేసి తిర్గివత్తురు. ఇట్టి దాడి జరుగుతుందని శత్రులు ఏమాత్రం అనుకోక పోవటం వలన, వారు బిత్తరపోయారు. ఇట్లా దిగిన బ్రిటిషు సైనికుల నందరిని పట్టుకున్నామని ఇటాలియనులు ప్రకటించారు. కాని అది అసత్యం. 60 మంది తప్ప మిగతా వారంతా తిరిగినౌకలలో నెక్కివచ్చారు. లిబియాన గంరంలో బ్రిటిషు సైన్యాలీవిధంగా శత్రు పురోగమనాన్ని పూర్తిగా అరికట్టడమేగాక, శత్రుకేంద్రాలకు గొప్ప నష్టం కలిగిస్తున్నాయి.

సోమవారంనాడు, బ్రిటిషు నౌకా, విమానదళాలు ఉత్తరాఫ్రికాలో శత్రు కేంద్రమగు ట్రిపోలీ నెదిర్చి తీవ్రంగా బాంబులను గుండ్లను వర్షించాయి. రేవులోవున్న 6 సప్లైయి నౌకలు, ఒక చిన్న తరగతి యుద్ధ నౌకనుముంచివేశాయి. సైనికులను మోసుకుపోయే 4 పెద్ద విమానాలు గూడ పడగొట్టబడ్డాయి. యీ దాడిలో బ్రిటీషు నౌకలకు, ఏవిధమగు నష్టంలేకుండా సురక్షితంగా తిరిగివచ్చాయి.

### టర్కీ - ఈరాక్ - ఈరాన్.

బాల్కను యుద్ధ ఫలితములగురించి టర్కీ మొదట కొంత ఆందోళన పడింది. కాని ఇపుడు రానున్న ఆపదను ధైర్యంతో యెదుర్కొనుటకు కృత నిశ్చయమైయున్నది. టర్కీలోనున్న జర్మను రాయబారియగు వాన్ పేపన్ గారిని, హిట్లరు సంప్రదింపులకు పిలిపించాడు. అతనితో పాటే, రష్యాలోనున్న జర్మన్ రాయబారినిగూడా పిలిపించాడు. వీరుభయులూ, బాల్కను యుద్ధరంగ ప్రాంతాలలోనున్న హిట్లరును కలుసుకొని మాట్లాడిరి. టర్కీతో ఒక విధమగు నిరాక్రమణ యొడంబడిక చేసుకొని తన పలుకుబడిలోనికి తెచ్చుకోవాలని హిట్లరు ప్రయత్నం. టర్కీని యెదిర్చే వుద్దేశం తమకులేదని బల్గేరి రాయబారి టర్కీ ప్రభుత్వానికి 2 తేదీన అభయమిచ్చాడు. అయినా టర్కీ, అధికారులు ముందుజాగ్రత్తగా ఇస్టాన్‌బుల్ పట్నాన్నుంచి 25 వ తేదీన 12,000 ప్రజలను ఖాళీచేయిస్తున్నారు.

టర్కీకి తూర్పు సరిహద్దులలోనున్న ఈరాక్‌లో బ్రిటిషు ప్రభుత్వం ఈ నెల 17 వ తేదీన బలమైన సైన్యాలను దింపింది. యుద్ధంవస్తే యీవిధగా సైన్యాలను దింపుకోడానికి సౌకర్యాలిస్తామని, ఇరాక్ ప్రభుత్వం 1930 లో చేసుకొనిన ఒడంబడికలో బ్రిటిషు ప్రభుత్వంతో ఒప్పందం చేసుకుంది. ఈరాక్‌లో తిరుగబాటుచేసి, రషీద్ ఆలీగారి నాయకత్వం క్రింద క్రొత్తగా యేర్పడిన ప్రభుత్వం, బ్రిటిషు సైన్యాలను సగౌరవంగా ఆహ్వానించి, అన్ని సౌకర్యాలు యివ్వడానికి అంగీకరించారు. ఈరాక్‌లో బ్రిటిషు సైన్యాలుండటంవలన, కావలసినపుడు వెంటనే టర్కీకి సహాయంపంపడానికి, ఇరాక్‌లోవున్న బ్రిటిషువారి నూనెగనులను కాపాడుకోడానికి అనుకూలంగా వుంటుంది.

### దూర ప్రాచ్యం.

జపాను విదేశాంగ మంత్రి మట్సుఓకా గారు, ఐరోపా పర్యవేక్షణ యాత్రనుండి తిరిగివచ్చి 22 వ తేదిన స్వదేశం చేరుకున్నారు. జపాను - రష్యా ఒడంబడిక ఉభయ దేశాలకూ గూడ లాభకరమనీ, ఒక్క రష్యాకే గాదనీ అతడన్నాడు. "ప్రవాదా" అను రష్యను పత్రిక, ఇదిశాంత రక్షణకోసం యేర్పరుచుకొనబడిన ఒడంబడికగాని, మరియే ఇతర దేశంమీద విరోధం సాగించుటకు చేసుకొనబడినది గాదని వ్రాసింది. ఈ యొడంబడికకు యెక్కువ ప్రాముఖ్య మియ్యరాదని, యునైటెడు స్టేట్సు దేశీయాంగ కార్యదర్శి అన్నాడు. దీనివలన యునైటెడు సేట్సు ప్రభుత్వం, సోవియటు రష్యా యెడల అవలంబిస్తున్న అనుకూల వైఖరి మారునని చాలమంది అనుకుంటున్నారు. ఈ యొడంబడిక వలన, ఇంత

వరకు రష్యా చైనా ప్రభుత్వానికి చేస్తున్న ఆయుధ సహాయం తగ్గునాయని చైనా అధికారులు అడిగారు. రష్యా అధికారులు, తగ్గదనియు, యథాపూర్వంగానే సహాయం పంపుచుండెదమనియు జవాబిచ్చారు. చైనాలో యుద్ధం ముగించేవరకు జపాను క్రొత్తగా ఇతరులతో పోరాటం పెట్టుకోరాదనియు, చైనాకు రష్యా ఇంకా సహాయం చేస్తుంటే, ఈ యొడంబడికవలన ఎక్కువప్రయోజన ముండదనియు కొన్ని జపాను పత్రికలుగూడ అభిప్రాయపడుతున్నాయి. మట్సుకాగారు గురువారంనాడు ప్రీవీ కౌన్సిలులో, ఈ యొడంబడికను ధృవపరుపవలసినదని ప్రతిపాదించారు.

దూరప్రాచ్యంలో బ్రిటిషు సర్వసేనాధిపతియగు సర్. రాబర్టు బ్రూక్ పాఫాంగారు, చైనాలోని బ్రిటిషు రాయబారిని, స్ట్రెయిట్సు సెటిల్మెంటుల గవర్నరును పిలపించి, యుద్ధం వస్తే అన్ని బ్రిటిషు ప్రాంతాలను రక్షించడానికి చేయబడిన సన్నాహాలను తెలియజేశాడు. పాఫాంగారు సింగపూరు రేడియోలో ప్రసంగిస్తూ, బ్రిటిషు సైన్యాలు పూర్తిగా జయిస్తాయని ప్రకటించాడు.

జపాను నౌకా సైన్యాలు 19 వ తేదీన ఆకస్మికంగా చైనా దక్షిణ తీరపు రేవులనన్నిటిని, "నింగ్ పూ" రేవునూ కూడా ఆక్రమించాయనీ, చైనా ప్రభుత్వానికి సప్లయిలు అందకుండ నిరోధించడానికిగాను ఇటుల చేసితిమనీ జపాను అధికారులు ప్రకటించారు. పూచో రేవునగూడా, ఆ మరునాడు ఆక్రమించారు. దీనితో చైనా రేవులన్నీ జపానుల హస్తగతమైనాయి. ఫ్యూకీయన్, చెకియాంగ్ రాష్ట్రాలలో దేశాన్నాక్రమించడానికి గూడా జపాను సైన్యాలు ముందుకు పోతున్నాయి. బర్మారోడ్డుపై బాంబులు వేసి నష్టపరచితిమనిగూడ జపానులు ప్రకటిస్తున్నారు. దీనివలన చైనాకు ఆయుధ సామగ్రి సప్లైలకు ఏమీ చిక్కు గలుగదనీ, శత్రులనిరోధించడానికి చైనా సైన్యాలాయా ప్రదేశాలలో సమృద్ధిగా వున్నాయనీ చైనా అధికారులు ప్రకటిస్తున్నారు.

బ్రిటను, యునైటెడు స్టేట్సు, చైనా, ఆస్ట్రేలియా, ఇండియా, డచ్చి ఇండియా దీవుల ప్రభుత్వాలు—జపానును నిరోధించుటకుగాను సైనిక సహాయపు ఒడంబడిక చేసుకున్నాయని జపానీయులు వ్యాపింపచేస్తున్న వదంతి కేవలం అబద్ధమనీ, జపాను ప్రజలకు రోషాగ్రహాలను కలుగజేయుట కోసం ఈ వదంతి కల్పించబడిందనీ ఆస్ట్రేలియా మంత్రి సర్ ఫ్రెడరిక్ స్టివార్డుగారు ప్రకటించారు. జపాను దాడి వస్తే నిరోధించి తీరుతామని సంయుక్తరాష్ట్రాలలోని ఆస్ట్రేలియా రాయబారియగు కాసేగారు హెచ్చరించారు.

## అమెరికా సంయుక్తరాష్ట్రాలు.

కెనడా ప్రధానియగు మెకంజీ కింగుగారు, అమెరికా సంయుక్త రాష్ట్రాల అధ్యక్షుడగు రూజ్వెల్టుగారు 20 వ తేదీన న్యూయార్కులో కలసికొని, పశ్చిమార్ధగోళపు దేశాలనన్నిటినీ కాపాడుకొనుటకోసం ఉభయదేశాలు పరస్పరం సంపూర్ణమైన సహాయం చేసుకోడానికి, దేశరక్షణకు కావలసిన వస్తుసంపదను పరస్పరం సప్లయి చేసుకోడానికి యేర్పాటుచేసుకున్నారు. ఆంగ్లదేశంలో డాక్టర్లు చాలడంలేదనీ అథమం వేయిమంది యైనా అమెరికను డాక్టర్లు, వెంటనే ఆంగ్లదేశానికి వెళ్లి సహాయం చేయవలసిందనీ రూజ్వెల్టు అధ్యక్షుడు విజ్ఞప్తి చేశాడు. న్యూయార్కు మేయరగు లాగార్డియాగారు, అట్లాంటికు సముద్రంలో 900 మైళ్ల వరకు నౌకలకు రక్షణ ఒసగే బాధ్యతను యునైటెడు స్టేట్సు ప్రభుత్వం వహించాలన్నారు. దీనివలన బ్రిటిషు యుద్ధనౌకలభారం సగంవరకు తగ్గుతుంది.

## నౌకానష్టాలు.

బ్రిటిషు నౌకానష్టాలను శత్రులకు తెలియకుండా చేయడంకోసం, బ్రిటిషు ప్రభుత్వమువారు ప్రతివారం లెక్కల ప్రకటించు పద్ధతిని మానివేశారు. రాజపుతానాయను బ్రిటిషు సాయుధవర్తక నౌక మునిగిపోయింది. మధ్యధరా సముద్రంలో, బాల్కనులలోనికి శత్రులకు ఆయుధ సామగ్రిని తీసుకొనిపోవుచున్న 6,000 టన్నుల సప్లై నౌకను 8,000 టన్నుల నూనె నౌకను 7,000 ఆయుధ నౌకను, బ్రిటిషు విమానాలు ముంచివేశాయి. నార్వే తీరంలో మరియొక శత్రు నూనె నౌకగూడా ముంచివేయబడింది. యుద్ధనిర్వాహణార్థం, యుగోస్లావియా అధికారులు అమెరికా రేవులలోవున్న 120 వేల టన్నుల నౌకలను బ్రిటనున కిచ్చిరి.

క్రొత్తగా బ్రిటిషువారు నిర్మించుచున్న "ప్రిన్సుఆఫ్ వేల్సు అనే పెద్ద యుద్ధ నౌక నిర్మాణం పూర్తియై పనిలో చేరింది. యునైటెడు స్టేట్సు ప్రభుత్వం 20 టార్పెడో నౌకలను బ్రిటనుకు పంపింది. ఇవి గంటకు 60 మైళ్ల వేగం గలవి.

## విషీ, స్పెయిను.

విషీ ప్రభుత్వం జాతిసమితిలో తమకుగల సభ్యత్వాన్ని వదలుకొనుటకు ఈ నెల 18 వ తేదిన నిశ్చయించుకుంది. అక్షరాజ్యాలవారు, బాల్కనులలో తమకు కలిగిన విజయాలనుపయోగించుకొని, ఫ్రాన్సుగూడ తమతో బహిరంగముగా చేరేటట్లు చేసుకోడానికి విషీ ప్రభుత్వం వత్తిడిని హెచ్చించారు. తగిన సహకారభావం కనుపరస్తే ఫ్రాన్సుతో ఇపుడే తుదిసంధిచేసుకొనెదననిగూడా హిట్లరు ఆశపెట్టుచున్నాడు. విషీ ప్రభుత్వ ఉపప్రధాన మంత్రియగు డార్లన్ గారు, పారిస్ నగరంలో జర్మను ప్రతినిధియగు అబెట్జు గారితో సంప్రదింపులు సాగిస్తున్నాడు. డార్లన్, జర్మనీతో సహకారం చేయ్యాలనే అంటున్నట్లు పెటెయిను సేనానియే, యుద్ధవిరామ సంధిషరతులకుమించి అనవసరంగా బ్రిటనుపై ప్రతికూల చర్యలకు దిగరాదని పట్టుపట్టుచున్నట్లు తెలుస్తున్నది. కాని పరాసుమొరాకోలోనికి, జర్మను అధికారులు అధిక సంఖ్యాకులుగా ప్రవేశిస్తున్నారు.

స్పెయినునుగూడ, బహిరంగంగా అక్షరాజ్యాలతో చేరేటట్లు చేయడానికి నాజీలు తంత్రం చేస్తున్నారు. జర్మనులు జిబ్రాల్టరు రేవు దుర్గముపైకి దండెత్తి వెళ్లి ఆక్రమించుకోడానికి, జర్మను సైన్యాలకు సౌకర్యాలొసగవలసినదని స్పెయినును కోరుతున్నారు. స్పెయిను మంత్రివర్గం ప్రస్తుత అంతర్జాతీయ పరిస్థితులగురించి రెండు రోజులు చర్చించారు. కాని వారానిర్ణయాలను రహస్యంగా వుంచుకొన్నారు. ఫ్రాంకో సేనాని క్రొత్తగా సైనిక కళాశాలను ప్రారంభిస్తూ జర్మను సైన్యాన్ని ప్రశంసించాడు. బ్రిటను పైన స్పెయినులో ప్రతికూలాందోళన జోరుచేయబడు

తున్నది. బ్రిటిషు పార్లమెంటులో చాలమంది సభ్యులు, ఇటీవల 25 లక్షల పౌనులు స్పెయినుకు ఋణమిచ్చినందుకు బ్రిటిషు మంత్రివర్గచర్యను ఆక్షేపించారు.

## రష్యా, ఇతర తటస్థ రాష్ట్రాలు.

ఐర్లండు దేశపు రేవులను ఇతరులకు కవులుకలగాని ఇతర విధంగాగాని, యెన్నటికి ఇవ్వమని ఆ దేశపు రక్షణశాఖమంత్రి యగు ఆయికన్‌గారు ప్రకటించారు.

రష్యానుగూడ ఇటలీ-జర్మనీ-జపాను ఒడంబడికలో చేర వలసినదని అక్ష-రాజ్యాలు గోరగా, సోవియటు ప్రభుత్వం నిరాకరించిందని ప్రవాదాలను సోవియటు పత్రిక ప్రకటించింది.

## ఆక్రమిత దేశాలు.

ఇప్పటికంటె జర్మనీతో ఎక్కువగా కలసి పనిచేయించ డానికి రుమేనియాపైన నాజీలు చేయుచున్న వత్తిడివల్ల—జర్మనీకి, రుమేనియా ప్రభుత్వనాయకుడగు అంటోనెస్కూ సేనానికి విరోధాలు వ్యాపిస్తున్నాయి. జర్మను అభిమానులగు ఐరన్ గార్డులను అంటోనెస్కూగారు విశేషంగా అరెస్టు చేయిస్తున్నాడు. ఫురిశిక్షలు విధిస్తున్నాడు. హంగేరీకి రుమేనియాకూ క్రొత్త సరిహద్దున సైనిక సంఘర్షణాలు గూడ సంభవిస్తున్నాయి. అంటోనెస్కూ సేనాని, హంగేరీ సరిహద్దులకు 75 వేల సైన్యాలను పంపుతున్నాడు. యుగోస్లావియా పంపకంలో కలిగిన భేదాభిప్రాయములు ఈ వివాదాలకు కొంతవరకు కారణం.

# గ్రీసు.

[మధ్యధరా సముద్రము ఉత్తరమున గ్రీసు దేశము గలదు. దీని విస్తీర్ణము 1,30,000 చదరపు మైళ్లు. జన సంఖ్య 6,300,000. తూర్పున ఈజియను సముద్రం, దక్షిణమున మధ్యధరా సముద్రం, పడమర ఏడ్రియాటిక్ సముద్రం, ఉత్తరాన యుగోస్లోవియా ఆల్బేనియా బల్గేరియా దేశములు, దీనికి సరిహద్దులు. ఏథెన్సు నగరం ముఖ్యపట్నం.]

గ్రీసుదేశము మ్యాపులో చాల చిన్నదిగనే కనబడును. కాని ఆ దేశంలో ప్రతిగజం మేరకు ఏదో ఒక చారిత్రిక ప్రాముఖ్యతగలదు. క్రీస్తు పుట్టక పూర్వం 600 సంవత్సరములనాడు గ్రీకులు మంచినాగరికత కలిగియుండిరి. ఆ నాగరికత ఇప్పటివారికిగూడ ఆశ్చర్యము కలిగించక మానదు. స్వాతంత్ర్యము, సౌందర్యము, విజ్ఞానము, సమగ్రత, గ్రీకుల వద్దనే ఇతరులు నేర్చుకొనిరి. మధ్యధరా సముద్రమంతయు వీరి స్వాధీనమందుండెను. దేశ స్వాతంత్ర్యము కాపాడుకొనుటకు వీరొనర్చిన మహాయుద్ధముల కథలు నేటికిని అన్ని దేశముల బాలురకును దేశాభిమానమును పురిగొల్పుచుండును.

అనేక శతాబ్దములవరకు మరపు రాని కవులు, వేదాంతులు, వీరులు, ఈ దేశమున ఉద్భవించిరి. హోమరు అను మహాకవి, ప్లేటో అను వేదాంతి, హిరోడోటస్ అను చరిత్రకారుడు; డెమస్తనీస్ అను మహావక్త; సోక్రటెస్ అను మేధావి, అట్టివారిలో కొందరు.

స్వాతంత్ర్య ప్రియులగు గ్రీకులు ఇదివరకు ఏ విదేశపు వీరుడు దండెత్తివచ్చినను తరిమివేయుచుండిరి. ఇప్పుడు హిట్లరు ముసోలినీలనుగూడ తరిమివేయుచున్నారు. పూర్వము పెర్షియా వారిని తరిమివేసినట్లె గత శతాబ్దమునందు టర్కీవారిని తరిమివేసి, స్వాతంత్ర్యమును కాపాడుకొనిరి. ఇంగ్లాండు రష్యాలు వీరికి తోడ్పడినవి. టర్కీ సామ్రాజ్యము నుండి గ్రీకులు విడబడుటవలన యూరప్ ఖండములో జాతీయాభిమానమునకు ప్రోత్సాహము కలిగెను. 1908 వ సం॥లో బల్గేరియాతో జరిగిన యుద్ధమునందు గ్రీసు విజయముపొంది క్రీటా అనుదీవిని సెలోనికా అను రేవుస్థలమును సంపాదించెను. వెనిజలాసు అను గ్రీకు రాజకీయవేత్త గత ఐరోపా యుద్ధమునందు, తన దేశమును మిత్రమండలి తరపున యుద్ధములోనికి దించెను. కాన్‌స్టెంటయిన్ అను గ్రీసు రాజు జర్మనీయెడల అభిమానముగల వాడగుటచే గ్రీసు నుండి తరిమివేయబడెను. ఈ యుద్ధఫలితంగా గ్రీసు చాలా రాజ్యభాగమును సంపాదించెను

1920 వ సంవత్సరములో అలగ్జాండరు రాజునకు కోతి కరచి చనిపోవుటచే తరిమివేయబడిన అతని తండ్రి కాన్‌స్టెన్‌టైను రాజు తిరిగి రాజయ్యెను. వెనిజలాస్‌గారు అపుడు టర్కీతో యుద్ధమునకు దిగెను. ఏష్యా మైనరులో గ్రీకులున్న ప్రాంతముల వశపరచుకొనదలచెను. కాని టర్కీ దేశమునకు ముస్తాఫా కెమల్ పాషాగారు నాయకత్వము వహించియున్నందున గ్రీకులు ఓడిపోయిరి. కాన్‌స్టెన్‌టైన్ రాజు 1922 వ సంవత్సరములో రాజ్యము విడచిపోయి, తరువాత చనిపోయెను. రాజునందు ప్రజలకు నమ్మకము పోయి 1924 వ సంవత్సరములో రెండవ జార్జి రాజు కూడా సింహాసనము విడిచిపోవలసివచ్చెను. గ్రీసు, ప్రజా ప్రతినిధిప్రభుత్వముగా మారిపోయినది. రాజుగారి అనుకూలురు ప్రజానాయకులు సర్వదా పోరాడుచుండిరి. ప్రజల నాయకుడగు వెనిజలస్ 1932-33 వ సంవత్సరము ఎన్నికలలో ఓడిపోయి, 1935 వ సంవత్సరములో పరదేశాలకు పోయి, మరువత్సరము ప్యారిసులో చనిపోయెను. రాజుగారి అనుకూలుడగు జనరల్ కాండిలిస్‌గారు అధికారము వహించి ఏప్రిల్ 1935 వ సంవత్సరములో జార్జి రాజును తిరిగి సింహాసనమును ఎక్కించెను. కాండిలిస్‌గారుకూడ చనిపోయిన పిదప జనరల్ మెటాక్సస్ 1936 వ సంవత్సరములో ప్రధాన మంత్రిగా ఎన్నుకోబడెను. శాసన సభను రద్దుచేసి రాజకీయ పార్టీలను అణచివేసి మెటక్సాస్‌గారు గ్రీసులో శాంతి చేకూర్చెను. ఈతడు హిట్లరు ముసోలినీలవలె నిరంకుశాధికారి అవుతాడని అందరు అనుకొన్నారు.

## ఇటలీ దాడి.

కాని ఆతడు దేశస్వాతంత్ర్య సిద్ధాంతమును ఎన్నడు విడువలేదు. పరదేశాలతో లాలూచి పడలేదు. గత అక్టోబరు నెలలో ఇటలీ గ్రీసునకు మూడు గంటల వ్యవధితో అంత్య సందేశమును పంపెను. మెటక్సాస్ దానిని తిరస్కరించి ఇటలీదాడిని ఎదుర్కొనుటకు సిద్ధముగ ఉండెను. ఇటలీకి ప్రతికూలముగా తన సముద్రములోనికి బ్రిటిషు నౌకా

దళమును రానిచ్చి, బ్రిటిషుగూఢచారులను గ్రీసులోనికి రానిచ్చి ఆల్బేనియా సరిహద్దులందు తగవులు పెంచుచున్నారని గ్రీసుపై ఇటలీ నిందలు మోపెను. గ్రీసు తటస్థంగా ఉండలేదనియు, ఇంగ్లాండు ప్రోత్సాహంతో ఇటలీకి ప్రతికూల చర్యలు చేయుచున్నదనియు, ఇటలీ నిందించెను. అందుకు ప్రతిగా గ్రీసు రాజ్యంలో కొర్ఫు, క్రీటా, ఎపిరస్, పిరస్ ఈ నాలుగు స్థలములు తనవశము చేయవలెనని ఇటలీ కోరెను. అట్లయిన గ్రీక్ స్వాతంత్ర్యమును గౌరవింతుననెను. లేకున్నచో దాడిచేయుదుమని బెదరించెను. జనరల్ మెటాక్సాస్‌గారు ఈ అంత్యసందేశమును వెంటనే నిరాకరించెను. "గ్రీసుపై ఇటలీ యుద్ధము ప్రకటించినట్లె యీ సందేశము ద్వారా భావించుచున్నాను" అని ఇటలీ మంత్రికి చెప్పెను. సైనికులందరిని సిద్ధముచేసెను. "స్వాతంత్ర్యముకొరకు, గ్రీసు గౌరవముకొరకు, ఐకమత్యంకొరకు పోరాడవలసిన సుముహూర్తము ఇదే," అని ప్రజలను హెచ్చరించెను. అక్టోబరు 28 వ తేది తెల్లవారు జామున 3 గంటలకు అంత్య సందేశమును పంపిన ఇటలీ, ఉదయం 5½ గంటలలోపలనే, తాను చెప్పిన 3 గంటల వ్యవధికి ఇంకా అరగంట ఉండగనే, ఆల్బేనియానుండి గ్రీసులోనికి సైన్యమును పంపెను.

## జనరలు మెటాక్సాసు ధైర్యం.

ఇటలీ సేనలశక్తిని ఎరిగియున్న మెటాక్సాస్‌గారు రోమన్ దుండగులను ఎదిరించుటకు ఏల నిశ్చయించెనని అడుగవచ్చును. ఇటలీ సైనికులకన్న గ్రీసు సైనికులకు ధైర్యము, దేశాభిమానము చాల ఎక్కువని అతడెరుగును. గ్రీసు కొండల లోయలలో ఇటలీ టాంకులు పనిచేయలేవు. అంతేకాక టర్కీతో అతడు సఖ్యత ఒడంబడిక చేసుకొనెను. టర్కీ, గ్రీస్, రుమేనియా, యుగోస్లావియా ఈ నాలుగు దేశములు అన్యోన్య సహాయపు ఒడంబడిక చేసుకొన్నవి. దీనినే బాల్కన్ ఎంటెంటి అంటారు. జర్మన్ రాజ్యకాంక్షను ఇది అడ్డలేకపోయింది. రుమేనియా హిట్లర్ చేతిలో కీలుబొమ్మ అయినది. కాని టర్కీ దృఢముగా ఉన్నది. యుగోస్లావియా కూడ ఒకవారం అటు ఇటుగా ఉండి చివరకు గ్రీసు పక్షమున ఉండుటకు నిశ్చయించెను.

గ్రీసునకు ముఖ్యబలము ఇంగ్లాండు స్నేహమె. ఇటలీ ఆల్బేనియాపై దాడి ప్రారంభించి గ్రీసుని బెదరించగానే గ్రీసుకి సహాయం చేస్తానని ఇంగ్లాండు హామి ఇచ్చింది. (1939 వ సం॥ ఏప్రిల్) సెప్టెంబరులో యుద్ధం ప్రారంభం కాగానే గ్రీసు తటస్థంగా ఉంటానంటె కూడదని ఇంగ్లాండు అనలేదు. కాని ముసోలిని గ్రీసుపై దాడి ప్రారంభించగానే బ్రిటిషు మంత్రి వర్గం సమావేశమై గ్రీసుకు సహాయము చేయ నిశ్చయించెను. "మాకు వీలైనంత సహాయంచేసి మనశత్రువుతో పోరాడి విజయమునంది మీకు భాగం ఇస్తాము" అని చర్చిల్ ప్రధాని సందేశమంపెను.

బ్రిటిషువారి సహాయం రాకముందే గ్రీసు ఇటలీ వశమగునని పలువురు భయపడిరి. కాని ఇటలీదాడి మంచి ఎత్తులపై జరుగలేదు. గ్రీకులు అమితమైన దేశాభిమానముతో బ్రిటిషు విమానాల సహాయంతో శత్రువులను తమదేశమునుండి తరిమివేయడమేకాక ఆల్బేనియాలోకూడ ప్రవేశించిరి. ఇటలీవారు మూడువైపులనుండి గ్రీసులో ప్రవేశింపజూచిరి. (1) ఫ్లోరినావైపునుండి కొండమార్గముల ద్వారావచ్చి సలోనికా నగరముపైబడిరి. ఇది గ్రీసులో రెండవ ముఖ్యపట్నము. ఈజియన్ సముద్రపు ముఖ్య రేవుస్థలము. (2) యనీనా నగరము పట్టుకొనుటకు పిండస్ రాష్ట్రములోనికి ఇటలీ సైనికులు వచ్చిరి. (3) ఎపిరస్ రాష్ట్రములో సముద్రతీరాన కర్ఫు దీవికి ఎదురుగా ఇటలీ సైన్యాలువచ్చినవి. ఈ కర్ఫుదీవిని తీసుకోవాలని ఇటలీ ఎంతకాలమునుండియో ఆశపడుచుండెను.

## యుద్ధక్రమం.

ఫ్లోరినా రాష్ట్రంలో గ్రీకులు కొండలపైనుండి దాడివచు శత్రువులను ముందుకు సాగకుండ అరికట్టుచుండిరి. ఆల్బేనియాలో ఇటలీవారికి సప్లయి కేంద్రమగు కోరిట్జాను తొమ్మిదిరోజులు యుద్ధంచేసి గ్రీకులు వశపరచుకొనిరి. సలోనికాపై బెదురుపోయినది. మొదట్లో సముద్రతీరాన ఇటలీసైన్యం కొంతదూరం కలామసునదివరకు రాగలిగెను. కాని గ్రీకులు బలం చిక్కబట్టి, వారిని వెనుకకు తిరిగి ఆల్బేనియాలోనికి పంపివేయగల్గిరి. ఇటలీ నౌకాదళం ఏమయిందో తెలియదు. ఇటలీ సైన్యానికి సహాయంలేకుండెను. పిండసు రాష్ట్రమునందు యనినావరకు ఇటలీ సైన్యం రాగలిగెను. కాని గ్రీకులు ఆసైన్యాన్ని అన్నివైపులనుండి చుట్టువేసి వారిని నాశనంచేసిరి. నవంబరులోను డిశంబరులోను గ్రీకులు ఆల్బేనియాలో చాలనగరాలను వశపరచుకొనిరి. జనవరి ఫిబ్రవరి మాసములందు మంచు ఎక్కువ పడుటచే యుద్ధం తీవ్రంగా జరుగలేదు. ముసోలిని తన సేనానాయకులను తరుచు మారుస్తూ, సైన్యాలకు ధైర్యం చెప్పుటకై చివరకు తానే స్వయంగా ఆల్బేనియా యుద్ధరంగానికి వచ్చెను. కాని లాభంలేకుండెను. గ్రీకుల తీవ్రమగు దాడిని తన సైనికులు ఎదిరించలేక, ధైర్యంచెడి వెనుకకు మరలిరి,

గ్రీకులు ధైర్యసాహసాలతో పోరాడుచునే యుండిరి. వారి నాయకుడు జనరలు మెటక్సాసు అకస్మాతుగా చనిపోయినా చెక్కుచెదరక మార్చిసరికి ఇటలీ ఎత్తులన్ని భగ్నం చేసిరి. చచ్చినవారు, ఖైదీలు తప్ప తక్కిన ఇటలీవారెవ్వరు తమ దేశంలో కాలుపెట్టకుండా చేసిరి. ఆల్బేనియాలో ముందుకి పోవుచుండిరి. బ్రిటిషు మిత్రులకు ఏడ్రియాటికు సముద్రంలో ఎక్కువ సదుపాయంగానుండే వెలోనా, దురాజో రేవు స్థలములను ఆక్రమింప యత్నించుచుండిరి. కాని వారిని యింకో ఉపద్రవం ఎదుర్కొన్నది. బ్రిటనుపై దాడిచేయజాలకపోయిన హిట్లరు, ఆల్బేనియా ఆఫ్రికాలందు ఇటలీ ఓడిపోవుచుండుటచే చీకాకుచెంది, బాల్కను యుద్ధరంగమున ప్రవేశించుటకు నిశ్చయించెను.

## జర్మను సేనల ప్రవేశం.

మార్చి నెల మొదట్లోనే బల్గేరియా సరిహద్దుదాటి జర్మను సేనలు గ్రీసులో ప్రవేశించి గ్రీకులను భయపెట్టజూచెను. లాభంలేక హిట్లరు యుగోస్లావియా గ్రీసులు రెండింటిపై ఒకేసారి దాడి ప్రారంభించెను. గతవారం సూచించినట్లుగా ప్రారంభంలోనే సలోనికారేవు తీసుకొని, యుగోస్లావియా గ్రీసు సైన్యములు కలియకుండా విడగొట్టుటయే కాక, ఒకే సమయమున రెండు దేశాలలో పలుతావులందు వారిని బెదరించగల్గెను. మొదట తటస్థంగానుండి, బ్రిటిషు విదేశాంగమంత్రి ఈడెనుగారిని, సేనాధిపతి డిల్లుగారిని తన దేశంలోకి రాగూడదన్నంత మడికట్టుకున్న యుగోస్లావియా యిపుడు జర్మనీ దాడిని ఎదుర్కోలేక పోయెను. గ్రీకులు బ్రిటిషువారి సహాయంతో జర్మను దాడిని అరికట్టగల్గిరి. కొద్ది వారాల క్రిందటనే జనరలు మెటక్సాసుకి బదులుగ ప్రధానియైన కోరిజిసుగారు, యిపుడు చనిపోయిరి. కాని గ్రీకులు ధైర్యం వీడలేదు. ఇటలీ సైన్యాలకెంత భయపడలేదో జర్మను సైన్యాలకు అంత నిర్భయంగానే వారున్నారు. "చావును లక్ష్యం చేయరాదన్నదే ఎల్లపుడు మన ఆదర్శవాక్యము." అని వారి సేనాధిపతి పాపగాసుగారు ప్రకటించిరి. వారి రాజు తానే ప్రధానిగానుండి గట్టి పరిపాలక వర్గమును ఏర్పరచెను, తన చెంతను సుశిక్షితమగు సాయుధ బ్రిటిషు సామ్రాజ్య సేనలున్నాయను ధైర్యంతో, యింకా ఎక్కువగ అమెరికా సహాయం చేయగలదను నమ్మకంతో, అతడు విజయం పొందేవరకు యుద్ధం కొనసాగించును.

---

# మధ్యధరా యుద్ధంలో యుక్తి:

చేరువప్రాచ్యదేశమున యుద్ధం అతితీవ్రంగా జరుగుచున్నది. దీని ఫలితంగూర్చి యోచించునపుడు కొన్ని ముఖ్యవిషయాలు గమనించాలి. గ్రీసు అద్భుతంగా నిరోధిస్తుందని, యుగోస్లావియా తిరుగబడుతుందని జర్మనీ ఎన్నడు అనుకోలేదు. ఈ సందర్భంలో వారికి సహాయం చేయడమే ఇంగ్లాండు చేయతగ్గపని. కాని యుగోస్లావియాకు సమయానికి బ్రిటిషువారి సహాయం అందలేదు. బ్రిటిషువారు చాలా తెగింపు చేయవలసివచ్చెను. ఆ విషయం మేధావియగు వేవల్ సేనాని గమనించియే యుండెను. మటపన్ యుద్ధంలో విజయం పొందినప్పటినుండి బ్రిటిషువారు సైన్యాలకు సరకు రవానా ఏర్పాట్లు ఎక్కువ భద్రపరచుకొనిరి. ఎర సముద్రమునుండి ఇటలీవారు తరిమివేయబడిరి. అచటి రేవులకు అమెరికా స్టీమరులు వచ్చే అవకాశం గలదు. అందుచే బ్రిటిషువారిస్థితి మరింత దిట్టమైనది.

మధ్యధరా సముద్రంయొక్క రెండు తీరాలలో జరుగుచున్న యుద్ధములకు సామ్యముగలదు. బ్రిటిషు సామ్రాజ్య సేనలు గుఱ్ఱపుడెక్క ఆకారములో అమర్చబడినవి. అలగ్జాండ్రియా రేవు సూయజ్ కాలవ దీని మధ్యభాగము. ఎడమవైపు సైన్యం ఈజిప్టు అవలనున్న సిరినైకావరకును, కుడివైపు సైన్యం గ్రీసు అల్బేనియా యుగోస్లావియాలవరకును సాగియున్నవి. సముద్రమార్గములు వాటిని కలుపుచున్నవి. బ్రిటిషు నౌకాదళము ఆ మార్గములను కాపాడుచున్నది. మధ్యభాగమున యుద్ధము, ఇటాలియను తూర్పు ఆఫ్రికా ఆక్రమణతో ముగియనున్నది. అచ్చట 2,00,000 ఇటాలీ సైన్యం నాశనము చేయబడినది. ఇటలీ నౌకాదళము చెడగొట్టబడినది. దీని ఫలితంగా బ్రిటను ఈ కేంద్రమునుండి కుడి ఎడమ భాగపు సైన్యములకు సరకు సప్లయిలు నిరాఘాటంగా చేయును, ఇంగ్లాండు అమెరికాలనుండి వచ్చు సామానులు ఎఱ్ఱసముద్రం రేవుల ద్వారా అలగ్జాండ్రియా శిబిరమునకువచ్చి చేరగలవు.

## మిత్రమండలి నిరోధము.

గ్రీసుని ఇటలీ ఆక్రమించలేక పోవడం, యుగోస్లావియా తిరుగుబాటు ఈ రెండు మిత్రమండలికి గొప్ప అవకాశమును ఇచ్చినవి. హిట్లరుని యూరపులోనే ఇంకో భాగమున ఎదిరించుటకు వీలయ్యెను. దక్షణానికి అతడు బలవత్తరమగు సైన్యం పంపెను. జర్మనీ ఆక్రమించిన దేశాలన్నిటిలో సరకులను ఆహారపదార్థములను దోచివేయుచున్నది. ఇంగ్లాండునకు అమెరికానుండి వచ్చే సహాయం ఆలస్యమగుటచే ఈ విషయమున కొంచెము వెనుకబడుచున్నది. అందుకని హిట్లరు యిచటి యుద్ధమును, అతిత్వరగా ముగించాలని ఎంత త్యాగమైనా చేస్తున్నాడు. వేలకొలది సైనికులను నిర్లక్ష్యంగా ఆహుతి చేస్తున్నాడు. ఈ ధాటిని గీకు బ్రిటిషు సేనలు ఎదుర్కొనుచున్నవి. కొన్ని అపజయాలు పెద్దవే కలిగినా కలగవచ్చు.

మొనాస్టిర్, సలోనికా, ఒలింపస్ కొండ, లారిస్సా నగరాలను మిత్రమండలివారు ఖాళీచేసిరి. త్రేసు రాష్ట్రములోనికి జర్మను సేనలు వచ్చినవి. ఇవన్నీ జర్మనీ ప్రారంభవిజయాలే కావచ్చును. కాని ఈ గెలిచిన స్థలాలు అన్నీ నిలబెట్టుకొనగలుగునా? మరి కొన్ని బ్రిటిష్ సేనలు వచ్చి చేరేవరకు ఈ సైన్యాలు యుద్ధం సాగిస్తునే యుండాలి.

ఇంకో విషయం బాగాతెలుసుకోవాలి. బెంగాజిని విడిచిపెట్టి, బార్డియాను ఖాళీచేసి, టోబ్రూకువరకు వచ్చినందుకు వేవలు సేనానిని నిందుస్తున్నారు. ఇవి సహింపరాని ఓటములే కావచ్చు. కాని వేవల్ సేనాని మొదట అనుకున్నప్రకారం యెడారిలో పడి ముందుకుపోయి లిబియాలోని ట్రిపోలి తీసుకొనవలసినది అని వాదించడం లిబియా నైసర్గిక పరిస్థితులు తెలియక చేసేపని. ఇంకో ఐదువందల మైళ్లు అతడు వశపరచుకొనియుండినచో దానిని కాపాడుటకు లిబియాలో ఎక్కువసేనను ఉంచి తూర్పు ఆఫ్రికాలో విజయం పొందలేకుండును. ఉదహరణ: బెంగాజివద్ద బ్రిటిష్ దాడి నిలిపివేయబట్టే తూర్పు ఆఫ్రికాలో కెరెన్ మాసావా నగరములను ఆక్రమించగలిగిరి. పైగా యుగోస్లావియా గ్రీసుల మీదకు జర్మను సేనలు వచ్చుచుండెను. ఆఫ్రికా యెడారులను మిగుల్చుకోవడమా లేక గ్రీసుకి సహాయము చేయడమా అనే సమస్య వచ్చినప్పుడు ఏది మంచిపనో బుద్ధిగలవారందరికి సులభంగా తెలియగలదు. అలగ్జాండ్రియా సూయజులను రక్షింపవలసియున్నది. అందుకు మిత్రమండలి సేనలు ఎడారినుండి వెనుకకు తగ్గి తమ శక్తిని కేంద్రీకరించుకొని శత్రువునకు ఎక్కువ నష్టమును కలుగజేయుచుండెను. ఈలోగా

రాయల్ విమానాలు బ్రిటిషు యుద్ధ నౌకలు, సిసిలీవద్ద శత్రువుల రవాణా నౌకలను ముంచివేయుచుండెను. సిరెనైకాలో ఉన్న శత్రు సేనలు చాలా దూరంలో ఉన్న ట్రిపోలి వరకు ఎడారి మీదుగా పోయి తప్పించుకొనవలసియున్నది. బ్రిటిష్ నౌకాదళము బలము కలిగియుండుటచే శత్రు సైన్యాలు సముద్ర మార్గమున తప్పించుకపోజాలవు. లిబియాలో శత్రువిమానాలు చాలా పడగొట్టబడినవి. వాటికి బదులు క్రొత్తవి వచ్చుట దుర్లభము.

## ఉత్తర ఆఫ్రికాలో జర్మనుల బలం.

### వంటచెరకు విషయంలోను మంచినీటి విషయంలోను వారి కష్టాలు.

టైమ్సు యుద్ధ విలేఖరి యీ క్రింది విధంగా వ్రాస్తున్నాడు :—

వారి అంతట వారు యుద్ధం చేసేటప్పటికంటె జర్మనుల ఆజ్ఞలక్రింద పనిచేసేటప్పుడు, ఇటలీ దేశీయులు జయించ సాధ్యంకానివారుగా నుంటారు. ఇట్టి ఇటలీవారి సహాయంతో జర్మనులు ఉత్తర ఆఫ్రికాలో చాలా ఎక్కువగా నున్నారు. వారి టాంకులుకూడ ఎక్కువగా ఉన్నాయి. విమానాలవల్ల వారి వంటచెరుకు చాలమట్టుకు వస్తూవుంది. వారికి మంచినీరు దొరకడంలేదు. వారు ముందుకు పోయిన కొద్దీ యీ చిక్కు పెద్దదౌతుంది.

డైలీ టెలిగ్రాఫ్ పత్రిక తన సంపాదకీయ వ్యాసంలో యీ క్రింది విధంగా వ్రాసింది :—

బెంగాజీపట్టణం వశమైన వెంటనే ట్రిపోలీ పట్టణాన్ని ఎందుకు వశపర్చుకోలేదనే ప్రశ్న కలుగుతుంది. కాని ట్రిపోలీ అంత సులభంగా దొరికేదికాదు. ఈ లోపల నైలు ప్రదేశంలో ఉన్న సైన్యం బాల్కన్ రాజ్యాలకుగాని తూర్పు ఆఫ్రికాకుగాని వెళ్లవలసివచ్చింది. గ్రీసుకు మనం నిజంగా సహాయం చేయవలసియుండెను. మన బలాన్నంతా పంపవలసిందే. వర్షకాలం రాకముందే తూర్పు ఆఫ్రికా యుద్ధం ముగిసేటట్లు ప్రయత్నించవలసి ఉంది. ఈ కారణాలవల్ల ట్రిపోలీని విడిచిపెట్టవలసి వచ్చింది. అయినా, ఇందువల్ల ఫలితం లభించింది. లిబియాలోని ఆసోటా ప్రభువు లొంగిపోయాడు.

మధ్యప్రాచ్యంలో శత్రుబలంకంటే మనబలం చాలా తక్కువే. అంచేత మెళకువతో వర్తించి మన బలాల్ని వేర్వేరు యుద్ధరంగాలకి మార్చాలిసి ఉంది. అంచేత ఒక్క సిరినీషియాలో తప్ప ప్రతిచోటా గెలిచాము. లిబియాలో మన సైనికాధికారులు బాగానే వర్తించారు. కాని జర్మన్ సైన్యాలు అతి మిక్కుటంగా వచ్చిపడ్డాయి. ఆక్సిసు రాజ్యాలు తప్ప, యుద్ధ విషయాల్ని విమర్శించకూడదని ఎవరు చెప్పరు. ఈ మన కష్ట సమయంలో మనం ధైర్యంగా ఉండి మన నమ్మకం చూరగొన్న మన సైన్యాల్ని మనం గట్టిగా నమ్మాలి.

## ఇరాకులో భారతీయ సేనలు.

కొద్ది రోజులనుండి ఇరాకుపేరు వార్తలలో ఎక్కువగ అగుపడుచున్నది. ఈ దేశమునకు తూర్పున పెర్షియా (ఇరాను), దక్షిణమున అరేబియా, పడమర ఉత్తరమునందు టర్కీ, సిరియా, ట్రాంసు జోర్డేనియా దేశములుగలవు. ఇటీవలనే సయ్యదు రషీదు అలి అను నాయకుడు ప్రభుత్వమును పడగొట్టి తాను సర్వాధికారము వహించెను. ఈతడు తమదేశం 1930 వ సంవత్సరంలో ఇంగ్లాండుతో గావించుకున్న ఒడంబడిక తప్పక అమలు జరుపుతానని ప్రకటించెను. ఈ ఒడంబడిక ప్రకారం, యుద్ధంవస్తే బ్రిటిషు ప్రభుత్వంవారికి తమ దేశంలో అన్ని సౌకర్యములు సహాయము ఇరాకు ఒసంగ నిశ్చయించెను. రైల్వేలు, నదులు, రేవులు, విమానాశ్రయములు మార్గములు అన్ని ఉపయోగించుటకు వీలుండును. ఇరాకు ప్రజలు బ్రిటిషువారికి అనుకూలురు. బ్రిటిషు సేనలు త్వరలో బాస్రానగరమునకు వచ్చునని బ్రిటిషు ప్రభుత్వంవారు తెలుపగానే వెంటనే అంగీకరించిరి. ఏప్రిల్ 17, 18 తేదీలలో బ్రిటిషు సేనలు ఇరాకులో దిగినపుడు గొప్ప స్వాగత మొసంగబడెను. గత యుద్ధంలో యీ ప్రాంతం ప్రజలకు బ్రిటిషు సేనలు ఇండియను సేనలతో పరిచయంగలదు. ఇపుడును బ్రిటిషు, ఇండియను సేనలే వెళ్ళినవి.

టర్కీకి తూర్పునఉన్న దేశాలలో జర్మనీ కొంత కల్పించుకొనుచున్నది. ఇరాకు, ఇరాను దేశములగుండా జర్మను సేనలుపోయి ఈజిప్టుపై దాడి వెడలుటకు, ఆ ప్రభుత్వముల అనుమతిని జర్మనీ కోరెను. జర్మనీ-టర్కీలమధ్య నిరాక్రమణ ఒడంబడిక గావించుటకు టర్కీలోఉన్న జర్మను రాయబారి వాను పాపనుగారు ప్రయత్నించుచుండిరని చెప్పబడెను. టర్కీకి నష్టంలేకుండ, సరిహద్దులను కాపాడతామనియు సిరియాలో కొంతభాగంకూడ యిప్పిస్తామనియు, టర్కీకి జర్మనీ చెప్పియుండును. ఈవలలో టర్కీ చిక్కుకొనదనియే ఎంచవచ్చును. ఇందు కంగీకరించినచో, టర్కీకి దిగ్బంధమేర్పడి, ఆ దేశంలో హిట్లరు అధికారం ఎక్కువగును. టర్కీ, ఇరాకు, ఇరాను, ఆఫ్ఘనిస్తాను ఈ నాల్గు ముస్లిము రాజ్యాలకు సాదాబాదు ఒడంబడిక ఒకటిగలదు. ఇరాకు ద్వారాగాని సిరియాద్వారాగాని జర్మనులు త్రోసుకొనివచ్చినచో యీ ఒడంబడిక భంగపడును. రాజకీయ పరిస్థితులనుగూర్చి చర్చించుటకు యీ నాల్గుదేశాల సభ జరుగునని ఒక వదంతిగలదు. ఇరాకులో అపుడే బ్రిటిషు ఇండియను సేనలు చేరడం, టర్కీ ఇంగ్లాండుతో సఖ్యతగ ఉండడం, హిట్లరుకి నిరుత్సాహం కలుగజేసి, తూర్పు దాడికి నిరోధం కలిగించెను.

సలహా : ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరుచుకొనుడు.

[మదరాసు సమాచారముల డైరెక్టరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS: PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.